Regd No. హై.౨౫౮ / M, 3813

విడిపత్రిక వెల ౧ అణా

మాగ్రంథాలు
ఉప్పుల విషాదము
వెల ౭ అణాలు.
నేయో పా ఖ్యానము
వెల ౮ అణాలు
గోలకొండ పత్రికాలయం.

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు అర్ధవార జాతీయ పత్రిక

సంపుటము ౧౮ ● హైదరాబాదు దక్కను శా. శ. ౧౮౬౫ స్వభాను భాద్రపద శు॥ ౧౦ (3-౧౧-౧౩౫౨ ఫ) గురువారము ● సంచిక 3౫



# ఇటలీలో బ్రిటిషుసేనలు దిగి ముందుకు సాగుచున్నవి

## దక్షిణ ఇటలీనుండి ఇటాలీయపక్ష సేనలు లేచిపోవుచున్నవి

పోయినఆగస్టు ౩౧ తేదినుండి సెప్టెంబరు ౭ తేది వరకు పలుకేంద్రములనుండివచ్చిన యుద్ధసమాచారములో ముఖ్యతమమైనవి ఇటలీదక్షిణభాగముపై బ్రిటిషుసేనలయొక్కయు, కనడావారిసేనల యొక్కయు అమెరికనులసేనల యొక్కయు దండయాత్రనుగురించినవి.

### ఇటలీ

ఇటలీలో దక్షిణభాగమందేగాక ఉత్తరభాగమందుకూడ ఓడరేవులపైనను విమానాశ్రయములపైనను, రైలుబాటలకూడలిచోటులపైనను బ్రిటిషువారియొక్కయు అమెరికావారి యొక్కయు విమానములు బాంబులనువేయుచు ఇటాలీయపక్షమువారికి నష్టములనుకలిగించినవిధమును పూర్వసంచికలలో గమనించుచునేయుంటిమి. ఇట్లు ఇటలీదక్షిణభాగమందు సముద్రతీరప్రదేశములయందలి ఓడరేవులమీదను, విమానాశ్రయములనుమీదను సేనలకుపయోగపడదగిన ముఖ్యములైన బాటలమీదను బ్రిటిషునౌకలును, అమెరికావారినౌకలును ఫిరంగుల దెబ్బలనువేసి నష్టములనుకలిగించినవి. అంతేగాక కొందరు బ్రిటిషుపక్షపు కమాండో సైనికులు ఇటలీదక్షిణభాగమందలి సముద్రతీరమందున్న కాలిబ్రియాలోకిపోయి ఇటాలీయపక్షసేనలకు చాల నష్టములనుకలిగించిరి. ఇట్టిదండయాత్రలు ఒకవారమురోజులుజరిగినవి. జర్మనీనుండి జర్మనులు ఇటలీలో ప్రామచేర్చుకొనియున్న సేనలకు కావలసిన సామగ్రులనుగొనిపోవుట కుపయోగించగల బాటలన్నిటిపైనను బ్రిటిషువారివిమానములు గొప్పనష్టమునుకలిగించుచు దెబ్బలను వేసినవి.

ఇవన్నియు జరిగినతర్వాత తుదకు బ్రిటిషువారియొక్కయు కనడావారియొక్కయు సేనలు సెప్టెంబరు ౩ తేది ఉ॥ ౪-౩౦ లవేళ మెసీనాసముద్రమును దాటి ఇటలీదక్షిణభాగమందు రెడియోసమీపమున దిగినవి. అప్పుడు సంయుక్తజాతుల రేడియోలో ఇటలీప్రజలకొక ప్రత్యేకమైనవిజ్ఞప్తి చేయబడెను. ఇటాలీయప్రజలు మిత్రమండలివారి సేనలను తమ దాస్యవిమోచకులనుగ భావించి ఆదరించవలెనని ఇటాలీయప్రజలు ఆవిజ్ఞప్తిలో కోరబడిరి.

రేగియోఅనునది ఇటలీదేశపు దక్షిణభాగమున చాలముఖ్యమైన రేవుపట్టణము. దానిసమీపమున దిగిన బ్రిటిషుపక్షపుసేనలు దానిని, అక్కడినుండి ముందుకుపోయి గాలికో పట్టినారు. తర్వాత శాన్ జియోవాని అను దానిని రెగియోకుదక్షిణమున విమానాశ్రయములను ఆక్రమించుకొనినవి. ఇటాలీయపక్షసేనలపైనుండి పారిపోవుచున్నసేనలను బ్రిటిషుపక్షపువారు పంపిరి. ఇటాలీయులు తమసేనలను, జర్మనులను దక్షిణ ఇటలీయందే ప్రతిఘటనకు ఏర్పాటులుచేసిరి. జర్మనుసేనలు ఉత్తరమునుండి దక్షిణానికి ప్రయాణమైనవి.

రేగియోనుండి బ్రిటిషుపక్షపుసేనలు సముద్రతీరప్రదేశమున ఉత్తరదక్షిణముగాను కొండలలోకి తూర్పుగాను యాత్రసాగించినవి. మరికొన్ని బ్రిటిషుపక్షసేనలు ఓడలనుండి ఇటలీదక్షిణభాగమునందే సముద్రతీరమందలి బాటునందు ఒకదానికొకటి ౧౫ మైళ్ళ దూరముగనుండు రెండుస్థలములలో దిగినవి. మెలిటోను పట్టుబడినట్లు ఒకవార్త వచ్చినది. స్పెజియాలో అమెరికావారిసేనలు దిగినట్లును ఒకవార్త వచ్చినది, ఈవార్తలనిజము ధ్రువపడలేదు.

బ్రిటిషుసేనలును కనడావారిసేనలును ముందుకసాగిపోవుచు రెగియోడికాలిబ్రియానుండి ౧౫ మైళ్ళదూరములో ఉత్తరసముద్రతీరభాగమునను దుబాగ్నారాను, మెలిటోనుపట్టుకొని ఇంకను ముందుకుపోయి సెప్టెంబరు ౬ తేదిన సాన్ స్టెఫానొ, కలన్నా, సాన్ రాబర్టో, సినోపోలీ, డెలియనువా, సాన్ రొసారియో, సాన్ రాఫెల్, ముసొలీనియా, లగండాయీ, సాన్ ఆలెసియో అను పట్టణములను పట్టుకొని, ఇంకనుఉత్తరముగపోవుచుపాల్మి నిసమీపించుచున్నవి. బ్రిటిషుపక్షసేనలు శత్రుసేనలప్రదేశములోకి ఇంతవరకు ౧౨ మైళ్ళు ముందుకుజొచ్చుకొనిపోయినవి. ఈప్రదేశము పిల్లానుండి సాన్ స్టెఫానొవరకును, రేగియోవరకును వ్యాపించియున్నది. ఇంతవరకు ౩౦౦౦మంది శత్రుసైనికులను ఖైదీలనుగపట్టుకొనిరి. వీరిలో ఎక్కువమంది ఇటాలీయులే.

ఇప్పుడుదక్షిణఇటలీలోనుండి జర్మనులు లేచిపోవుచున్నారు.

బ్రిటిషుసేనలు ఇటలీదక్షిణభాగమున దిగినదినాడు, అనగారవతేదిన రోం రేడియోలో బ్రిటనునుద్దేశించి గావించిన బ్రాడుకాస్టు వచనములలో పరతులేకుండ ఇటాలీయసేనలు బ్రిటిషుమిత్రమండలివారికి పరతులేకుండ లొంగవలెననినమాటను గురించి సమాధానము చెప్పుచు, "న్యాయము గాను ఆదరణీయముగను కనిపించు దానినిదేనినైనను మేము ఒప్పుకొనగలము" అని చెప్పబడినది.

క్రైస్తవమతమున రోమన్ కాథలిక్కుమతమునకు అధికారియగు పోపుగారు రోములో ఉండే నగరభాగమందు కార్డినల్ లనుమతాధికారుల సభయొకటి జరిగెను. దానికి గొప్పప్రాముఖ్యము ఉండవచ్చునని అనుకొనుచున్నారు.

### రష్యా

రష్యాలో రష్యనుసేనలు అన్నిరంగములలోను చాలవేగముగాముందుకు పోవుచున్నవి. జర్మనుసేనలు ఓడినప్రదేశములనువిడిచిపోవుటకై చేసినపోరాటములన్నిటిలోను ఓడించబడినారు.

కర్స్కురంగములో సెవాస్కుకు నైఋతి వైపునను పడమటను, వ్యాజమాకు నైఋతివైపునను, స్మాలెన్స్కురంగమునందు బ్రయాన్స్కికిదక్షిణమునను రష్యనుసేనలు జర్మనుసేనలమీదికి క్రొత్తదండయాత్రనుప్రారంభించి నిజాన్స్కుకుదక్షిణమున రెండుమైళ్ళదూరమునందు రైలుస్టేషను పట్టణమును, రైనాస్కుకుపడమట రెండుమైళ్ళదూరములోనుండు కొనొటాపు పట్టణమును ఆక్రమించి అక్కడినుండి పడమరగా కీయెవ్ కు చేరబోవుచున్నవి. అనగా రష్యనుసేనలు యుక్రెయినురాష్ట్రపు ఉత్తరభాగములో ప్రవేశించినవన్నమాట. స్టాలినోవైపున రష్యనుసేనలు చాలముఖ్యమైన ఎర్సియానుపట్టణమునుపట్టుకొని దానికిదక్షిణమున క్రిమియాలోని జర్మనులకు సంబంధముకలిగిన రైలుబాటలలో ఒకముఖ్యమైన దానిని పట్టుకొనుటకుపోవుచున్నవి. రాస్తావాకు వనుశర్వెంటాస్కి పట్టణమును ఆక్రమించినవి.

ఉత్తరయుక్రెయినులోను, బ్రియాన్స్కుకుదక్షిణమున జర్మనుసేనలను రష్యనుసేనలు ఛేదించి, ఇప్పుడు క్రమముగా దక్షిణమునుండి రైలుబాటలకేంద్రములను కొనొటాపు, బాఖ్మాక్, చెర్నిగావులను ముట్టడించుచున్నవి. చెర్నిగావుఅనునది యుక్రెయినులో డెస్నానదిగట్టునను ముఖ్యపట్టణము.

### మహారాష్ట్రకమ్యూనిస్టుపార్టీ కార్యాలయపు సోదా

పూనా, సెప్టెంబరు ౮

పోలీసులు నేడుకమ్యూనిస్టు పార్టీవారి మహారాష్ట్రశాఖ కార్యాలయమును సోదాచేసి 'కయ్యూరుమార్టర్'అను పుస్తకముయొక్క ఒకప్రతిని పట్టుకొనిపోయిరి. (అ.ప్రె.)



### గమనిక

ఆచారప్రకారము వినాయక చతుర్థికి పత్రిక వెలువడదు. అందుచేత మొన్నటి సోమవారమునాడు మాపత్రిక వెళ్ళలేదు. పాఠకులు గమనించగలరు.

## ఇండియాసమస్యలపై రంగుజాతులన్నిటిదృష్టి

హెచ్. ఏ. మిల్లర్ గారు 'రీనాల్డుస్ న్యూసు' అనుపత్రికలో ఇట్లువ్రాసినారు:—

"సంయుక్తజాతులకు విజయముకలిగినచో తమకేమిలాభమనియు, ఇండియాలో ప్రతిష్ఠంభనము ఇంకనుఅట్లే యుండునాయనియు, నల్లజాతులవారివిషయములో ముసోలినికిపూర్వమే ఫాసిస్టులవలెవర్తించిన దక్షిణాఫ్రికావారలను తూర్పుఆఫ్రికావారలకును అధికారము నిచ్చెదరాయనియు, సంయుక్తరాజ్యపు నీగ్రోలు తక్కువజాతివారలని వారికనిపించచేయుదురెనాయనియు, నీగ్రోలను "నిగర్లు"అనియు, చైనీయులను చింకులనియు, ఇంకను పిలుచుచుండవలెనా లేకవారలుకూడ తక్కినవారివలెనే ఆదరణగౌరవములకు అర్హులనువిషయమును గ్రహించెదరనియు రంగుజాతులవారలు అడుగుచున్నారు.

"డోవరుగారు రంగుజాతులజనులు ఇండియాసంగతిని చాలశ్రద్ధతోగమనించుచున్నట్లు వ్రాసినారు. జపానీయులు చాలయుక్తితో ప్రచారము చేయుచున్నట్లును, అమెరికాలోకూడ ఆప్రచారప్రమాణముచే చాలమంది ఎక్కువగా ఆకర్షించబడుచున్నారనియు ఆగ్రంథకర్త వ్రాసినారు. "అందరివిషయములోను న్యాయముజరుగవలెను, లేనిచో జరుగునదేదియో నిర్ణయముగాయేయున్నదని ఆగ్రంథకర్త వ్రాసినాడు"

# గోలకొండడైరీ

పూర్తి కావచ్చినది. ౧౦ దినాలలో అమ్మకమగును

## పోలీసుఠాణాపై దండయాత్ర

భాగల్పూరు, సెప్టెంబరు ౮

భాగల్పూరుకు రామైళ్ళదూరములో సోనబారాసుదేవియొక్క ఉత్తరప్రుగట్టు సమీపమునయుండు పోలీసుఠాణామీదికి వేకువజామున తుపాకులలో ౧౫౦మంది గుంపుగావచ్చిపడిరి. వారలను ఒకుందిసాయుధులైన పోలీసులను, నిరాయుధులైనయుగుడు పోలీసులనుప్రతిఘటించి పోరాడిరి. నిరాయుధుడైన అసిస్టెంటుపోలీసు సబిన్స్పెక్టరు సాయుధులైనపోలీసులను హెచ్చరించుటకై పోయినప్పుడు అనుమదగింద్రులలోనొకరు అతని మెడపట్టుకొనినను, ఆతడువిడిపించుకొని కాపలావేయుచుండినవానివద్దకుపోయెను. అకాపలావాడు తుపాకి సబిన్స్పెక్టరుమెడపట్టుకొన్న దుండగీడుపైనయెత్తి కాల్చెను. ఆదుండగీండ్రు గట్టిశబ్దముతో నిర్మించినఆఠాణాలోనికి తుపాకులను ప్రేల్చిరి. అందుచే హవిల్దారున్ను, చాలమంది కానిస్టేబిళ్లును ఎక్కువగాగాయపడిరి. అసిస్టెంటు సబిన్స్పెక్టరు బల్లెముతోపొడువబడెను, కాని పొడచినవాడు తుపాకిదెబ్బతో చనిపోయెను. హవల్దారుకుగొప్ప గాయములైనను, ఆతడుస్వయముగా తుపాకిగుండ్లను ప్రేల్చుచు తనమనుష్యులను ముందుకునడిపించుచుండెను. కానిస్టేబిళ్లును, ఆదుండగీండ్రును ముష్టాముష్టిపోరాడుకొనిరి. చాలమంది కానిస్టేబిలులకు గాయములయ్యెను. దూరమునుండిన దుండగీండ్రనాయకులిరువురుఅంతట ఆదుండగీండ్రగుంపును పారిపొమ్మనిరి. ఆదుండగీండ్రుతుపాకులను, రైఫిల్లను, మందుసామగ్రిని అక్కడనేవదలివేసి పారిపోయిరి. పోలీసులు వారి వెంటపడి వారలు పారిపోకముందే ఇంకనుఅనేకులనుకొట్టిరి. ఆదుండగీండ్రలో ౧౫గురుమరణించినారు, అనేకులు గాయపడినారు. పోలీసులలోకూడ అనేకులు గాయపడినారు.

## మదరాసు రాష్ట్రంలో బియ్యపు రేషనింగు

మదరాసు సెప్టెంబరు ౮

మదరాసునగరంలో బియ్యపురేషనింగు నేడు అమలులోకివచ్చినది. నగరములో లైసెన్సుపొందిన బియ్యపుదుకాణములవద్ద రేషనుకార్డులుగలజనులు గుంపులుగుంపులుగానుండిరి. ఏ.ఆర్.పి. అధికారులు గుంపులనుసర్దుటలో తోడ్పడిరి. రూపాయిగకి ౩ శేర్లచొప్పున రోజుకు ౧౨ఏండ్లకుపైన వయస్సుగలవారలకు ఒక్కొక్కనికి ౧౦ ఔన్సులచొప్పునను, ౧౨ఏండ్లకులోపుగల వయస్సుగలవారలకు ఒక్కొక్కరికి ౫ ఔన్సుల చొప్పునను యిచ్చుచున్నారు. వారమునకుసరిపోవునంతకూడ ఒక్కసారిగానే యిచ్చేఏర్పాటుకూడ ఉన్నది.

బెజవాడ, సెప్టెంబరు ౮

బెజవాడలో రేషను పద్ధతిపెట్టుటకైఅధికారులు లెక్కలు తేల్చబడినవి.

నేటిరాత్రి

బ్రహ్మాండమైన విడుదల

ఇతర స్థలములలో వేలకొలది ప్రజలు నాకర్షించిన చిత్రము

బ్రహ్మపుత్రుడైన దక్షుడు అధికగర్వోన్మాదుడై పరిపాలించుట— చంద్రుని శపించుట— శివుడు చంద్రునకు భయమిచ్చుట- ఇది తెలిసి దక్షుడు శంకరునిపై కక్షవహించుట— దక్షునిపుత్రిక శివుని ప్రేమించి అతనినే తననాథునిగా నెంచుచుండుట— స్వయంవరము పెట్టుట— శివుని కాహ్వాన మంపకుండుట— శివుడు స్వయంవరములో ప్రత్యక్షమై సతీదేవిని గొనిపోవుట— దక్షుడు ఉడుకుట—

# దక్షయజ్ఞము

శోభనాచల పిక్చర్సు వారి చిత్రము

దక్షుడు విశ్వశ్రేయమునకై గొప్పయజ్ఞము చేయుట— ఆ యజ్ఞమునకు సతీదేవి ప్రయాణమై శివుని సెలవడుగుట- శివుడంగీకరించకుండుట—సతీదేవి తండ్రి పిలువకున్నను, భర్తయను జ్ఞనివ్వకున్నను తండ్రియజ్ఞము గాంచనరుగుట- అక్కడ దక్షుడు కూతురును పరాభవించుట శివుడు ప్రళయకాలరుద్రుడై, వీరభద్రుని సృష్టించుట— తరువాత— తెరపై చూడుడు—

గగ్గయ్య, కృష్ణవేణి, సుందమ్మ, రామకృష్ణశాస్త్రి, రామారావు, రాజరత్నం, కమల, వరలక్ష్మి మొదలగువారు—

అగ్రోస్ టూరింగ్ టాకీస్
హిమాయత్ నగర్ రోడ్
నారాయణగుడ డిపోవెనుక, హైదరాబాదు దక్షిణ
Khan and Sons

గోలకొండపత్రిక

స్వభాను సం॥ర భాద్రపద శు॥ ౧౦ గురువారము

# క్షామకాండ

యూరోపులో యుద్ధకాండ. భారతదేశములో క్షామ కాండ. బెంగాలులో మరణకాండ. అన్నమా! అన్నమా! అని భారతదేశమంతటను ప్రతిధ్వనులు చెలరేగినవి.

మీరెక్కువ తినుచున్నారు అని అమెరీమంత్రిఅన్నారు. కాని బెంగాలులో అజీర్ణముతో జనులు చచ్చుటలేదు. వారికి దినాలపేరట తిండిలేక పెంటలలో వెదకినా ఎంగిలిముక్కలు దొరకక, వీధులలోపడి విలవిల తన్నుకొని చచ్చిపోవుచున్నారు. దేశమంతటను చక్కెరకొరత, తిండికొరత, బట్టకొరత, పెట్రోలు కొరత. అన్నీ రేషన్ అయిపోవుచున్నవి. ఇట్టిగతి మనకు పట్టినది కొంచెంలేకనో యేమొ గతసంవత్సరం సిలోనుకు ధాన్యం ఎగుమతిచేసినారు. ఇప్పుడు సిలోను నుండి ఒక పైసాచందాకూడ బెంగాలుకు పోవుటలేదు. అయ్యోపాపం అని పైసాఖర్చులేని హాహాకారమునైనా నటనకొరకైన ఆ లంకాజనులు ప్రకటించరాదా! ఈస్టిండియా కంపెనీ యొక్క అవతారమైన యూ. కే సీ.సీ. అనేవి మనదేశ ధాన్యాన్ని ఆఫ్రికా, ఏషియా, యూరోపుదేశాలకు ఎగుమతిచేసెను.

అయితే మనదేశంలో ధాన్యం ఎక్కువఉంటే బయటిపంపినట్లా లేక ఎట్లాతక్కువే ఉంచికదా, పదిలో పదకొండు. తక్కువలోమరీతక్కువఅయితే ఏమిలేఅని పంపినారా? మనదేశము సస్యశ్యామల దేశమట! తేనె,పాలు వరదలుగా వాగులు పారుచుండిన దేశమట!! బంగారువరహాల చెట్లు (పగోడావృక్షాలట!)కాచేదేశమట!! ఆ చెట్లను ఊపితె జల జల సువర్ణవర్షము కురిసేదట. ఈ విధముగా చరిత్రకారులు వర్ణించిరి. మనకు గోవుమాత. కాదు దేవత. ఋతుధర్మాలు ఈ కర్మభూమిలో సక్రమముగా జరుగుచుండెనట. అన్నిమంచి లక్షణాలైతే యిప్పుడు బెంగాలులో ప్లేగు ఎలుకలవలె కూటికి లేక జనులు నూర్లకొలదిగా ప్రతిదినము ఎందుకు చస్తూన్నారు? మనదేశములో మొదలే పంటతక్కువ. బర్మానుండిమలయానుండి బియ్యం మనకు దిగుమతి అగుచుండెను. అది ఆగిపోయెను మరిక్షామం దేశమంతటను వచ్చెను. తినేవారు ఎక్కువైరి. సైన్యంభర్తీ ఎక్కువయ్యెను. అమెరికన్ సైన్యానికి పశువులు వేలకొలది దినదినం చంపబడుచున్నది. ఇటలీ ఖైదీలకు తుష్టిపూర్తిగా భోజనం సాగుచున్నది. అని యీ విధముగా ఢిల్లీ శాసనసభలో సభ్యులే చాలనుండి తీవ్రముగా ఖండించిరి. కాపున మనదేశములో మనకుందికే సరిపోవునట్టి ధాన్యం పంటలులేవు. జనసంఖ్య హెచ్చినది. భూములు క్రమక్రమముగా నిస్సారమైపోయినవి. ఇవన్నీగమనించక వ్యాపారులు కొట్లలో భూగృహాలలో దాచిపెట్టినా ఏమయ్యా అనే వాదాన్ని రాత్రింబగళ్లు చేయుట ఆచారమైనది. గతానుగతికో లోకః. అట్లు అప్రమూ పట్టండి కోట్లను అం వారివెంట పడినారు. వ్యాపారులు తక్కువవారు కారు. ధరలుంటే వారు దాచుకోరు. ధాన్యము పుష్కలంగా రవానా అవుతుందని వారికి తెలిస్తే వెంటనే ధరలు పడిపోవును. దాగిన సరకులన్నీ బజారులోనికి రాగలవు. కావున యథార్థ మేమన మనదేశానికి పంట చాలదు. బయటినుండి రాదు. లోపలినుంచియే పోవుచువచ్చెను. అందుచేత ధరలు పెరిగినవి.

కూటికిలేని భారతదేశములో కూటి రేషన్ పెట్టుట తెలివితక్కువ తనమని మేము భావింతుము. రేషన్ పెట్టితే ధాన్యం ఎక్కువగా సప్లై చేయవలసి వచ్చును. ఎందుకంటారా ఒక్కొకరికి ధాన్యం దొరకదు. బెంగాలు సోదరులవలె మనమున్నూ మన్నుదిని చస్తాము అని జనులు ధాన్యం దాచుకొందురు. ఒక్కొక్క యింట్లో రెండంతల మంది ఉన్నట్లు చూపుదురు. ఎట్లో అవస్థపడి తాము సాధారణముగా కొనుచుండిన దానికంటే యెక్కువగా తీసుకొందురు. కావున రేషన్ తగదు. అయితే యేమి చేయవలెను. భారతదేశము నుండి ఒక గింజకూడా బయటి దేశాలకు పోకుండా ఏర్పాటు చేయవలెను, ఇటలీ ఖైదీలను వేరేదేశానికి మార్చవలెను. బయటిదేశాలనుండి అనగా అమెరికా ఆస్ట్రేలియ దేశాలనుండి ధాన్యం దిగుమతి చేయించవలెను ఎందుకనగా అమెరికా ఆస్ట్రేలియ దేశాలు మన దేశముకంటే చాలా పెద్దదేశాలు కాని జనసంఖ్య చాలా చాలా అల్పం. మన దేశములో ౧ మైలులో ౪౦౦ మంది వసించితే ఆ దేశాలలో ౫౦ మందివరకే నివసించుచున్నారు. వారికి సర్వసౌకర్యాలున్నవి. ధనమున్నది. సారమున్నవి. అంగబలమున్నది. బుద్ధిబలమున్నది. జాతీయ ప్రభుత్వమున్నది. వారెక్కువ పండించుతారు. వారి కెక్కువగా మిగులుతుంది. కావున ఆ దేశాల నుండి మనకు దిగుమతులు రావలెను. అప్పుడే యీ ఘోరం ముగిసిపోవును. పైగా ఇటీవలనే అమెరికావారు న్యూయార్కు నుండి హిట్లరు గెలిచిన గ్రీసుదేశములోని బీదలకు సహాయం చేయుటకు గాను ౧౫౦౦౦ టన్నుల ధాన్యం రవానాచేసిరి- మరి మన పాలకులు కేవరంపుతారు?

ఇదంతా ఎవరు చేస్తారు. ఎవరు వింటారు. అంతలోపల బెంగాలులో ఎందరుచస్తారో ఆ యమునికి ఆ లెక్కలు గీకే చిత్రగుప్తునికే యెరుక! బెంగాలులో చచ్చినవారి పటాలు, చావనున్నవారి పటాలు పత్రికలలో చూచినచో భయమగుచున్నది. వైస్రాయి బహద్దరుగారి భార్యగారే భయపడిపోయినారు. అందరున్నూ చందా లియ్యండి. నేను పత్రికలలో ఆ కళేబరాల పటాలను చూడలేను అని పాపం ఆ వైసరాజుగారి రాణీగారు ప్రకటించినారు. మన హైద్రాబాదు ప్రభుత్వం ఇదివరలో ఖండాంతర దేశాలకు లక్షల ధనమిచ్చినది. ఈ తడవ బెంగాలుకు కొన్నిలక్షల దానము వెంటనే యియ్యవలెనని కోరుచున్నాము. హైద్రాబాదు ధనికులంతా తమ చందా లియ్యవలెను. దానికై ఒక సంస్థ యేర్పడితే చందాలిచ్చువారికి ఎక్కువగా తమ చందాలివ్వవలెనో తెలియ రాగలదు. హైద్రాబాదు నగరవాసులిందును ఈ విషయము లో సత్వర చర్యలేమైనా? ఇప్పుడైనా చెయ్యండి అని సూచించుచున్నాము.

## శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము

"భక్తపోతన" టాకీలో శ్రీనాథుని పాత్రను ధరించి అభినయించిన శ్రీజంధ్యాల గౌరీనాథశాస్త్రిగారు ౯-౯-౪౩ గురువారము (ఈదినమే) సాయంకాలము ౬ గంటలకు, నిలయ భవనమున "సినిమాసంగీతము" అను విషయముపై సోదాహరణముగా ఉపన్యసింతురు. అందరు దయచేయ ప్రార్థన-

బి. వే. శే.

* *

సెా॥ సత్యవ్రతశుక్లజీ గారి యుద్యోగకాలము ౬ నెలలు పొడగింపబడినది.

* *

దసరా ఊరేగింపులో హైద్రాబాదునగరంలో అంబంబడిమాత్రమే ఆయుధాలుపట్టుకొనిపోవచ్చునట. ఇదేమన్యాయమని పండిత్ నరేంద్రజీగారంటున్నారు. ఇంకాఇట్లన్నారు. ఏటేట పరిగాదసరా ముందటనే ఈహుకుము వచ్చేదెందుకు హిందూ ముసల్మానుల పరస్పరం ప్రభుత్వానికుండదుగా. బహదూర్ ఖాన్ గారివి కాశ్మీరులోనికి రానీయకపోతే ఈ కాశ్మీరులో ముసల్మానులు ఇష్టంవచ్చినట్లుగా ఊరేగింపులు చేసుకొనిరి. వాటికేమిన్నీ అంకుశలు లేకపోయెను. ఇప్పుడెక్కడిదీనూడివచ్చెను?

* *

మద్రాసు మొహియుద్దీన్ గారు రాజద్రోహనేరముచేసినట్లుతలచి హైద్రాబాదునగర మేజిస్ట్రేటు వారికి ౪౦౦రూ॥ జుర్మానావిధించెను. దానిపై అపీలుచేయుచున్నారు.

* *

౧-౯-౧౯౪౩నాడు నిజామాబాదులో మిసెస్ గ్రిగ్సన్ గారు ప్రజలచేతను ప్రభుత్వముచేతను చందాలుకూర్చబడి కట్టబడనున్న ఆసుపత్రియొక్క శంకుస్థాపన చేసెరి. ఆసందర్భములో నిజామాబాదుపౌరులపక్షాన వారికిసన్మానపత్రము సమర్పింపబడెను. దానికిగ్రిగ్సన్ దొరవారు ప్రత్యుత్తరమిచ్చుచూ నిజామాబాదువాస్తవ్యులు చందంతలైనదని యీ ఒకఆసుపత్రిచాలనందున మరొకటి నిర్మింపదలచినదనియూ ప్రజలు ఒకలక్షరూపాయిలు చందాలు వసూలుజేసిన ప్రభుత్వమువారును అంతే యిత్తురని చెప్పగా ప్రజలు చేసిరనియు గొప్పగా యిచ్చినవారిలో ౧౧౦౦౦రూ॥ ఇచ్చిన నర్సాగౌడు గారు ప్రత్యేకముగా ప్రశంసింపదగినవారనియు ప్రత్యుత్తరమిచ్చుచు తమకు తమభార్యకు ఇచ్చిన సన్మానానికి కృతజ్ఞత వెలిబుచ్చిరి.

*

ఈనెలాఖరునుండి ఆసఫియాగ్రంథాలయము ప్రొద్దుననుండి సాయంత్రము ౫ వరకు తెరిచియుండును.

... ...

హైద్రాబాదు నగరములోని మురికికాలువల శాఖకు (డ్రయినేజిశాఖ) మునిసిపల్ కార్పొరేషన్ వారికి అప్పగింపుటకై మ ఘ-వ నిజాంగారు ఫర్మానిచ్చినారు. పూర్వము సర్ విశ్వేశ్వరయ్యగారు ఈమురికికాలువల నిర్మాణానికిగాను కోటి రూపాయిలు ఖర్చుచేయుటకు అంచనావేసి యిచ్చియుండిరి. ఆప్రణాళిక ప్రకారమే పనిజరుగుచూ వచ్చినది.

... ...

హైద్రాబాదునగరములో నేలబొగ్గు దొరుకుటకష్టమైనందున విద్యుత్తుసప్లయి పూర్వమువలె కాజాలనందున ఇంచుమించు పాతికవంతువరకు విద్యుత్సప్లయి తగ్గించినారు. ఆనాటినుండి ప్రతి యింటికి యిదివరలో వెలుగుచుండిన ఎంతవిద్యుత్తువ్యయమగుచుండెనో దానిలో పాతికవంతు తగ్గించినారు-ఇప్పుడు విద్యుత్ రేషన్ మొదలైనది రేషనుకంటే యెంతెక్కువ వ్యయముచేస్తే వారికి కనెక్షను తీసుకుండా సప్లయిపూర్తిగా ఆపివేయబడును మరలకొంత లేచార్జిలు వ్యవలసిన ఎక్కువగా కాబ్చిన విద్యుత్తు ఎక్కువచార్జి వేయబడును కావున విద్యుత్తికలవారు చిన్నచిన్న బల్బులు పెట్టుకొని రాత్రితొందరగా పండుకొన్న ఏవిధంగాఅవసరపడి ఎక్కువగా విద్యుత్తికావలసి వస్తేను అని ప్రభుత్వమువారు ప్రకటించినారు.

... ...

న. మహమ్మద్ దంఖాంఖారంగ బహద్దరుగారు వ్యాపారపరిశ్రమలశాఖా కార్యదర్శిపదవిని గతవారము స్వీకరించిరి. ఆ పదశాఖ అధ్యక్షులు హబీబుర్రహిమాన్ గారేర్పాటైరి. ప్ర॥ ప్రతిష్ఠాశాఖయొక్క సహాయకార్యదర్శిగా (సదస్యాదులు) భరతదేశమును తిన్నారూరేర్పాటైరి-

* *

సెప్టెంబరునెలాఖరులో "సత్యాగ్రహ ప్రకాశాసమును" సమర్పించిన సత్యాగ్రహ ప్రకాశములన్నింటిని తొలగించుట అభిమానము దేశానికి అర్పితముచేయుదురు సమాచారము.

* *

## హైద్రాబాదు రాష్ట్రములోకూడా

### కూటికిలేక చావులు మొదలైనవి

దక్కన్ క్రానికల్ లో రాయచూరువార్తలలో ౫ సెప్టెంబరునాటి పత్రికలో ఇట్లుప్రకటించినారు. "౩౧ ఆగస్టునాడు రాయచూరు టవునులో పటేలుకంపెనీ భవనాలవద్ద ఒకడు ఆకలిచే బాధపడి చనిపోయెనని తెలియవచ్చినది." "జొన్నలకరువు చాలా అయిపోయినందున చాలామంది చుట్టుపట్టుల గ్రామాలవారు మొదటి తాలూకాదారు కచ్చేరీకివచ్చి అయ్యా మాకతేమిఅని శంఖమువూరించిరి."

## హైద్రాబాదు సమాచారంలో ప్రకటనలు

హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనులో ప్రభుత్వప్రకటనశాఖవారు ప్రకటించుచున్న హైద్రాబాదుసమాచారంఅనే మాసపత్రికలో ప్రకటనలు వేయవలెనాలేదా అనేచర్చజరిగెను అందుపై జీ-యం ఖాన్ ఆనేవారిట్లనిరి. ఈ హైద్రాబాదుసమాచారపత్రులు ఏరెండువందలలో అచ్చగుచున్నవి. దాన్నితిరుగవేసిచూచేనాథుడులేడు. అది ప్రభుత్వమువారి ప్రచారానికి ఏర్పాటుజేయబడినట్టిది. అట్టిదానికిప్రకటనలు ఇచ్చుట యేమిటి?" అందువ ఏకవాక్యంగా ప్రకటనలియ్యరాదని కార్పొరేషన్ పెద్దలు తీర్మానించిరి.

* *

హైద్రాబాదు నగరములో ౩౧ ఆగస్టునాడు స్త్రీలసభ జరిగెను. దేశములో అన్నం లభించక తీవ్రక్షామమునకై బట్టకూడా లేక జనులు బాధపడుచున్నందున వారి కష్టాలలో సహాయము చేయుటకై స్త్రీలసభచేసిరి. ఎల్.ఆర్.ఎల్.బిరారు యువరాణీగారు సభా ప్రారంభమును చేసిరి. కేవలము ఆసఫ్ జాహీ వంశ మర్యాద ననుసరించి యేకాక మాతృ హృదయముతో స్త్రీ హృదయముతో ఈసమయములో తానుసహాయముచేయుటకు నిశ్చయపడినానని చెప్పిరి రాణిమారి నిలోఫర్ రాణీగారు అధ్యక్షతవహించి ఈయుద్ధబాధా సమస్యకు జాతిమతభేదాలు లేవనియు స్త్రీ పురుషులు సమభావములో దీనికి పాటుపడవలెననియు తెలిపిరి. తర్వాత సాహెబ్జాదా నఫీసాన్నిసా బేగంసాహెబాగారు ఈక్రిందితీర్మానాన్ని ప్రవేశపెట్టిరి.

"దేశములో దినదినం తిండిధాన్యాలు కరవైపోవుటను ఈసభవారు భయంకరదృష్టితో చూచుచున్నారు. ఇది స్త్రీలకు బాలురకు బీదవారికి నానా కష్టాలహేతువగుచున్నది. అందుచేత స్త్రీలు ముఖ్యముగా తమ సొంతవ్యయాలను తగ్గించుకొని త్యాగముచేసి ఈ సమయములో జనులకు సాయపడవలెను."

నగరములో ఈపనికై శ్రీ బిరారు యువరాణీగారు స్త్రీసమితి నొకదాని నేర్పాటుచేసి దానిద్వారా యింటింటికివెళ్లి సహాయమరించుటకై కోరబడిరి. దానిని వారంగీకరించిరి.

హైదరాబాదు(దక్కన్) నగరములో సుల్తానుబజారులో ౧-౯-౪౩నాడు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయమునందు జరిగిన మహాజనసభవారిచే ఈసంవత్సరమునకు ఈ క్రింది కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడెను

అధ్యక్షులు- శ్రీ శ్రీ రాజాబహద్దురు వేంకటరామారెడ్డి ఓ.బి.ఇ. గారు

ఉపాధ్యక్షులు:-శ్రీ అక్కినేపల్లి జానకిరామారావుగారు (జాగీర్దారు).
శ్రీ కొండముఖ కుమారరెడ్డిగారు (అత్తాపూరు)

గౌ. కార్యదర్శి:- బిరుదు వేంకటశేషయ్యగారు
గౌ. స.కార్యదర్శి-శ్రీ దేవులపల్లి విశ్వనాథము, ఎం.ఏ. గారు
గౌ. గ్రం.పాలకుడు:- యిడవల్లి వేంకటప్పయ్య సోమయాజులుగారు.

సభ్యులు:- ఎల్లం సత్యనారాయణ, అదిరాజు వీరభద్రరావు, తుంగారాముదాసు, గంటి లక్ష్మీనారాయణ, గంటి వేంకన్న, కె.ఆర్. నటరాజశర్మ, కందాళ నరసింహాచార్యులు, విద్వాన్, కల్వకొలను వేంకటరామయ్య బి.ఏ., ఓబుల రంగమ్మరెడ్డిగార్లు.

### గణేశుని మహోత్సవమును హిందూ ముస్లిములు కలిసి చేయుట

సెప్టెంబరు౩వ తేదిన మూసారాంబాగు తీగలగుడిలోని ఓంప్రకాశ పాఠశాల మండలివారిచే హిందూమహమ్మదీయులుకలిసి శ్రీరామాంజనేయ దేవాలయములో పూజాహారతులఅనంతరము పోలీసుపటేలు ఉమర్ ఖాన్ గారి అధ్యక్షతలో సభ జరిపిరి- యం-రామానుజాచార్యులుగారు గణపతి గూర్చి ఉపన్యసించిరి-శ్రీమతి సుమిత్రాదేవిగారు స్త్రీధర్మముపై చక్కగ ఉపన్యసించిరి- తమపటి ఉస్తాద్ అహమదుఖాన్ గారు ప్రేమజీవన్ మరియు హిందూమహమ్మదీయ ఐక్యమును గూర్చి మాట్లాడిరి. ఇట్లు

యం. రామానుజాచార్యులు

## హైదరాబాదు రేడియో తెలుగుకార్యక్రమము

౧౨ ఆగస్టునుండి రోజూపదినిమిషాలు తెలుగులో వార్తలు సమయం ౧౦గంటల ౧౫నిమిషాలనుండి ౧౦ ౧౫-౨౫నిమిషాలవరకుజరుగును.

మంగళవారం ౧౪ఆగస్టు౧౯౪౫ ౫-౪౫నుండి సంగీతం. యుద్ధము. పరిశ్రమలు:మహమ్మదు ఖాసింఖానుగారు.

శనివారం ౫ఆగస్టు ౧౯౪౫ ౫-౪౫నుండి నిజాంరాష్ట్రంలో చారిత్రిక స్థానములు: శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు.

మంగళవారం, ౮ ఆగస్టు ౧౯౪౫ ౫-౪౫ నుండి నిజాంరాష్ట్రములో ఆహారసమస్య: శ్రీబూర్గుల రామకృష్ణరావుగారు.

శనివారం ౧౨ఆగస్టు ౫-౪౫నుండి బాలుర మనస్తత్వం: శ్రీ బిరుదు వేంకటశేషయ్యగారు

మంగళవారం ౧౫ఆగస్టు ౫-౪౫నుండి కావ్యగానం శ్రీ సి. హెచ్. రంగాచారిగారు.

### దసరా ఓంపతాకోత్సవము

హైదరాబాదు (దక్కన్)నగరములో కేశవ నగరమున ౬-౯-౧౯౪౩ నాటిరాత్రి అక్కడి ఆర్యసమాజపు ప్రధానియగు పండితవినాయకరావు విద్యాలంకారుగారి అధ్యక్షతలో అంతరంగిక సభయొకటి జరిగెను. ఈసంవత్సరము దసరాలో పూర్వమువలెనే "ఓంపతాకపు"ఉత్సవము జరుపవలెనని తీర్మానించబడినది. కాని ఎంతశస్త్రములతోనే ఊరేగింపులోనివారలు ధరించవలెనని పోలీసువారు విధించిన నిర్బంధమునకు అసంతృప్తిపడిరి.

* *

### శుభంభూయాత్

మ-ఘ-వ నిజాంగారు ఒకపత్రికలో యిట్లు వ్రాసినారు మహమూదలీఖాన్, మసూదలీఖాన్ అనువారికి పెండ్లిచేయ్యాలైనా. వీరిద్దరుఅన్నదమ్ములు. అలీఘడులో విద్యపొందినారు. పెద్దవాడు బి-ఏ ప్యాసుఅయినాడు. వీరికిగవర్నమెంటు ఉద్యోగమిచ్చుటకు ఏర్పాట్లు ఆలోచింపబడుచున్నవి."

... ...

లాహోరులో విధవాసహాయకసభ స్థాపితమైనది. దానికిముఖ్యులు బీర్బా, దాల్మియా లేటుచందువంటివారు పలువురుకలరు. దానిసంబంధమగు నిబంధనాదులు కావలసినవారికి పంపుదురు. చందాలిచ్చిసహాయపడువారు సహాయము చేయవలెనని కోరుచున్నారు హిందూస్థానమంతటను వారుపైసభాశాఖల నేర్పాటు చేయుచున్నారు. వివరాలు తెలుసుకొనగోరువారు పైసభా కార్యదర్శికి ౩౦ ఫిరోజ్పూరురోడు లాహోరుకువ్రాసి తెలుసుకొనవచ్చును.

... ...

### అధికారుల మార్పులు

నవాబ్ మెయినుద్దీన్ యార్జంగుబహద్దురుగారు ప్రభుత్వప్రకటనశాఖకు రేడియోకు నాజంగా ఏర్పాటై పదవీస్వీకారము పొందిరి. బాబెహుదూరుముకు సహాయ కార్యదర్శిగా అన్ఫాక్ అహ్మదుగారు ఏర్పాటైరి. హబీబుర్రహిమాన్ గారు పరిశ్రమ.వ్యాపారశాఖ కార్యదర్శిగాను యూసుఫలీగారు చీఫారంశాఖ కార్యదర్శిగా పనిచేయుదురు నవాబ్ అలీయావర్జంగు బహద్దురు గారు హోంసెక్రటరీగా పనిచేయుచున్నారు.

### శ్రీ చెన్నకేశవాంధ్ర గ్రంథాలయము ఆరూరు.

ఈగ్రామం భువనగిరి తాలూకాలో వలిగొండ బస్సుస్టేజి సమీపమందున్నది. జనసంఖ్య (౨౫౦౦) గృహసంఖ్య(౭౦౦) దాదాపుండును. కొందరి స్థానికులకృషివలన, ఈమధ్యనే గ్రంథాలయము స్థాపించబడినది. దాదాపు ౬౦౦ గ్రంథములున్నవి. ౪ వార్తాపత్రికలు వచ్చుచున్నవి.

౨౯ఆగస్టు నాడు ఏనుగు రాజిరెడ్డి అల్మెరావు గారి అధ్యక్షతన గ్రంథాలయ ప్రారంభోత్సవము జరుపబడును. నాడేగ్రంథాలయ. ఆర్థికసహాయార్థమై పురవాసులచే శ్రీకృష్ణరాయభారము. అను నాటకప్రదర్శనము జరుగును-

## ప్రపంచములోకల్లా పెద్ద వంతెనలు

| | అడుగుల పొడవు. |
|---|---|
| లోయర్ జాంబెజి బ్రిడ్జి (తూర్పు ఆఫ్రికా) — — | ౧౧,౯౭౮ |
| టే బ్రిడ్జి (ఇంగ్లండు,రోడ్డు, రైల్వేలైను రెండున్న కలది) — — | ౧౦,౭౮౦ |
| సోన్ బ్రిడ్జి (ఇండియా) — — | ౧౦,౦౫౨ |
| గోదావరి బ్రిడ్జి ,, — — | ౮,౯౯౦ |
| గోల్డెన్ గేట్ బ్రిడ్జి (అమెరికా) — — | ౭,౪౫౦ |
| జార్జి వాషింగ్టన్ బ్రిడ్జి ,, — — | ౭,౨౪౩ |
| సిడ్ని హార్బరు బ్రిడ్జి (ఆస్ట్రేలియా. ౧౬౫౦అ॥ పెద్ద ఆర్చివున్నదిదీనికి) | 3,౭౭౦ |

(ప్రజామిత్ర)

## కొన్ని విదేశ విశేషములు

### స్పెయిను డిక్టేటరుతో బ్రిటిషు రాయబారి సంభాషణ

స్పెయిను డిక్టేటరు అగు ఫ్రాంకోగారితో స్పెయినుదేశమందు బ్రిటిషు ప్రభుత్వపు రాయబారి యగు సర్ సేమ్యూయల్ హోరుగారు ఇటీవల సంభాషించినారు. బ్రిటను, స్పెయినుల మధ్య మైత్రి చెడకుండాయుండుటకు పరస్పరము గమనించదగిన వర్తనమును గురించి వారలు ముచ్చటించుకొనిరనియు, ఇరువురును ఏకాభిప్రాయమునకు వచ్చిరనియు ప్రకటనచేయబడినది. ఆఫ్రికాలో టాంజియరున్న స్పెయిను వారి రక్షణలోనుండు అంతర్జాతీయ ప్రదేశము అక్కడ జర్మనులు ఇపుడు ఎక్కువగా చేరుచున్నారట. ఆ విషయమై బ్రిటిషు ప్రభుత్వమువారు ఆక్షేపణను హోరుగారి ద్వారా ఫ్రాంకోగారికి తెలియజేసిరని ఒక వార్త.

### ఫ్రెంచిజాతీయ విమోచన సమితి

ఉత్తర ఆఫ్రికాలో ఏర్పడిన పైసమితి ఫ్రెంచి ప్రజల ప్రతినిధియని బ్రిటను, అమెరికా, రష్యాలు తమ సేనల అధికారుల సైనికావసరములకు భంగము కలుగనంతవరకు అంగీకరించెదమని ప్రకటించినారు. బ్రిటిషు ప్రభుత్వమువారు తమ ఆమోదమును ఒక ప్రకటనలో తెల్పినారు. ఈ సమితిలోని సభ్యులందరును యుద్ధమును విజయాంతమువరకు సాధించుటకై ఐకమత్యముతో పనిచేయగలరనియు, యుద్ధంలో బ్రిటిషు మిత్రమండలి గెలిచిన తర్వాత, ఫ్రెంచి ప్రజలు ఒక నిశ్చయము లేకుండ తమ నిజమైన అభిప్రాయమును తెలుపగలిగినపుడు, వారలకిష్టమైన ఫ్రెంచి పరిపాలన వ్యవస్థను ఏర్పాటు చేసికొనుటకు అధికారము గలిగియుందురనియు.— తమకు నమ్మకము కలిగించబడినందున ఇదివరకు లేవాన్టులోని సిరియా భాగములపై ఫ్రెంచిజాతీయ సమితియు దాని అధికారము ఈ ఫ్రెంచిజాతీయ విమోచన సమితియును దానికి ఫ్రెంచి సామ్రాజ్యమందలి తమ భూభాగములపైగలదని ఒప్పుకొను ఫ్రెంచి ప్రజలుండు ప్రదేశములన్నిటిమీదను సదరుజాతీయ విమోచన సమితికున్నట్లు బ్రిటిషు ప్రభుత్వమువారు ఒప్పుకొనుచున్నారని బ్రిటిషు ప్రభుత్వ ప్రకటనలో చెప్పబడినది. బ్రిటిషు మిత్రమండలి వారి వ్యవస్థలో చేరి దానికిలోబడి ఫ్రెంచి ప్రజల పక్షమున యుద్ధవ్యవహారములను జరిపించుటకు ఈ ఫ్రెంచిజాతీయ విమోచన సమితికి అధికారము ఉండగలదనియు ఫ్రెంచి ప్రజల యోగక్షేమములకు సంబంధించిన విషయములలో ఈ సమితికి బాధ్యతయుండుననియు తాము అంగీకరించితిమని బ్రిటిషు ప్రభుత్వమువారు తెలిపినారు. ఈ సమితి పుట్టకముందు ఫ్రెంచి అధికారులతో బ్రిటిషువారికి జరిగిన ఒడంబడికలు పూర్వమువలెనే ఇప్పుడును అమలులోనుండవలెనని బ్రిటిషు ప్రభుత్వమువారు షరతు పెట్టినారు.

అమెరికా అధ్యక్షుడగు రూజ్వెల్టుగారు ఈ వేసంగతులను తెల్పుచు ఫ్రెంచిజాతీయ విమోచన సమితికి తమ ఆమోదము నొసగినారు. ఈ సమితిని ఫ్రెంచి ప్రజల ప్రభుత్వము అని తాము చెప్పుటలేదుగాని యుద్ధకాలమున ఉండే విక్కుల గుర్తించి ఫ్రెంచి ప్రజల యోగక్షేమములను రక్షించు సంస్థ అని తాము అంగీకరించినట్లు రూజ్వెల్టుగారు చెప్పినారు యుద్ధము ముగిసిన తర్వాత ఫ్రెంచి ప్రజలు తమకిష్టమైన ప్రభుత్వమును తామేర్పరచుకొనవచ్చునని చెప్పినారు.

### ఇటలీ

ఇటలీలో జర్మనులు ఇదివరకే ఉత్తరభాగమంతయు సేనను నింపినట్లు చూపియుంటిమి. ఇపుడు దక్షిణభాగములో బ్రిటిషు పక్షసేనలు దిగవచ్చినను తల పులతో ఆక్రమించు సేనలను నిలుపుచున్నారు బ్రిటిషువారి విమానాలు ఇటలీలోని ముఖ్యపట్టణములపై దెబ్బలను వేయుచున్నవి బ్రిటిషువారి తోపులు ఇటలీ సముద్ర తీరమందున్న ఓడరేవులపై దెబ్బలను వేయుచున్నవి అమెరికను విమానములును నౌకలును కూడ ఈ కార్యమున తోడ్పడుచున్నవి.

### చర్చిల్, రూజ్వెల్టుల సంభాషణ

ఇప్పుడు క్విబెక్ నగర సంభాషణకారులతోపాటు ప్రెసిడెంటు చేరుకొనినారు వారితోపాటు కార్డెల్ హాల్ గారు కూడ ఉండిరి. హాల్ గారు వెంట మార్షల్లుగారి ప్రాణమిత్రుడగు నార్మన్ డేవిసు గారున్నారు వీరలు అక్కడ పెరవ్య ప్రభుత్వపు రాయబారులతో మాట్లాడుదురని ఊహించగలదు

### అమెరికను వైమానికులపై రష్యనుచర్య

ఆగష్టు ౧౯ తేదిన సిమ్యాజేశపు చూమ్మకొసకు కాంచట్కాలో దిగిన ఒక అమెరికను విమానము

## ఈ యుద్ధము ఎవరి కొరకు?!

కనడాలో చర్చిల్, రూజ్వెల్టుగారల సంభాషణాల సందర్భమున ఇండియా సమస్య సంగతి ఏమైన వచ్చెనాయను ప్రశ్నకు ఆ సంభాషణల సమయము నడుండిన బ్రిటిషు ప్రభుత్వ ప్రచురణశాఖమంత్రి బ్రెండన్ బ్రాకెన్ గారు ఇండియా స్వాతంత్ర్య సమస్య మరిగిపోకుండ జాగ్రత్తగా ఉంచబడినదని చెప్పియుండిరిగదా? దాని విషయమై లండనులో ఉండే ఇండియా దేశమిత్రులగు బ్రిటిషువారలు "ఇండియా స్వాతంత్ర్యమును మరిగిపోకుండ ఉంచినచో యీ యుద్ధమును స్వాతంత్ర్యముకో అనుచున్న, ప్రజాస్వామికముకో అనుచు చేసే యుద్ధమని ఎట్లందురు, ఆక్షేపించుచున్నట్లు "ఫ్రీప్రెస్ జర్నల్" పత్రికకు దాని లండను విలేఖరి సెప్టెంబరు ౨ తేదిన పంపిన వార్తలో తెలుపబడినది.

లోని వైమానికులను రష్యను అధికారులు ఖైదుచేసినారట. ఈ విమానము క్యూరైల్ దీవులలోని జపానీయ యుద్ధసూలస్థానాలపై బాంబులను వేసి వచ్చుచుయుండగా చెడుటచే అక్కడ దిగవలసివచ్చెనట. అంతర్జాతీయ శాసన ప్రకారము రష్యనులు దానిలోని వైమానికులను అరెస్టుచేసినారట.

ఆగష్టు ౩౧ తేదిన బ్రెండన్ బ్రాకెన్ గారు క్విబెకు ఆలోచనలలో స్టాలినుగారు లేకుండుటయు, రష్యా ప్రభుత్వపు రాయబారి మార్పున్ను — రష్యావారు జర్మనీతో వేరే సంధిని కుదుర్చుకొనుటకు యత్నించునని సూచించజాలవని చెప్పెను. హిట్లరు సేనలతో యుద్ధముచేసి గెలువజాలెననియు, సంయుక్త జాతులలో పరస్పర విరోధములను కలిగించి యుద్ధములో పరాజయమును తప్పించుకొనగలడనియు, ఈ విషయములో ప్రజల ఇట్టి ఆశలకు ప్రోత్సాహమియరాదనియు బ్రాకెన్ గారు చెప్పిరి అంతకుముందు ఆగస్టు ౨౯ కెన్ గారు రష్యావారికి ఎంతగొప్ప విజయములు కలిగినను, రష్యాలో ఇంకను చాల గొప్ప జర్మను సేనయున్నదనియు, వాని నాయకులు చాలజిత్తులమారులనియు, ఈ ఎండకాలములోను ఆకురాలు కాలములోనో రష్యాపై ఘోరమైన దెబ్బలను వేయుటకు జర్మనీ సర్వవిధముల యత్నించగలదనియు చెప్పిరి.

క్విబెకు సంభాషణలలో జపానుపై యుద్ధచర్యలను గురించి ఎక్కువగ చర్చించుటచేతను, జపాను రష్యాలకు శత్రుత్వము లేనందువల్లను స్టాలిను క్విబెకు సంభాషణలలో కానరాని సూచితమైనది.

క్విబెకు సంభాషణలు ముగియగానే ఆసియా ఖండపు ఆగ్నేయ ప్రదేశమున మిత్రమండలి సేనలకన్నిటికిని సర్వాధిపతిగా కింగ్‌జార్జిగారి బంధువగు లార్డు లూయి మౌంట్ బాటన్ గారిని నియోగించినట్లు ప్రకటన చేయబడినది వీరిప్పుడు ఇండియానుండియే సైన్యమును నడిపించుచు జపానుపై దండయాత్ర జరిపించుటయని తెల్పబడినది. ఇందుకై ఎప్పుడు,ఎక్కడినుండి, ఏ సేనలను పంపుటయని యుద్ధచర్యల రహస్యములను తెలుపుటకు మౌంట్ బాటన్ గారు నిరాకరించినారు. ఇండియాలో సేనల ప్రధానాయకుడుగ ఆచిన్ లెక్ గారు ఉందురు మౌంట్ బాటన్ గారు నేరుగా చర్చిల్ గారికి జవాబు చెప్పవలసినవారై యుందురు ఈ నియామకముతో మౌంట్ బాటన్ గారు ఈ వర్గములో చేరిరి తర్వాత డిప్యూటీకి దండయాత్రలను సహించుచుండిరి.

ఇండియా, సిలోనునుండి జపానుపైన దండయాత్ర ప్రారంభముగునది ఏ మార్గాన అనగా మధ్యధరా సముద్ర ప్రదేశమువలె, ఇటలీలోను ఆకాశ్రయముల మీదను విమానాశ్రయముల మీదను, పరిశ్రమల మీదను, రవాణా సౌకర్యములగు రైళ్లు, ఓడరేవులు బ్రిటిషు అమెరికను విమానాలు తీవ్రములైన దాడులను చేయుచున్నవి. నేలమీదను అప్రకారముగ బ్రిటిషు సైన్యముల దాడియు, బ్రిటిషు మిత్రపక్షసేనలు ఎక్కువగా చేర్చబడుచున్నవి. అంతేకాక ఇటలీని కాపాడుటకు జర్మనులు ఇటలీలో పెద్దసంఖ్యలో జర్మను సేనలు నింపబడుచున్నవి. ఒక్కరును ప్రతిఘటించి పోరాడుటకై స్వయముగా పోనది తీరము వెంబడి దుర్గములను నిర్మించుచున్నారు

## గాంధిగారితో ఎవ్వరిని కలియనిచ్చేదిలేదు.

డిటెన్యూలుగా ఉంచబడిన రాజకీయ ఖైదీలతో మాట్లాడుదలచిన బంధువులకు అవకాశమిచ్చుటకు బొంబాయి ప్రభుత్వమువారు చేసిన ఆజ్ఞ గాంధి మహాత్మునికిని కాంగ్రెసు కార్యసమితి సభ్యులకును వర్తించదని — ఫ్రీప్రెస్ జర్నల్ లో ఒక వార్తవచ్చినది. ౧వ తరగతి డిటెన్యూలకు నెలకొకసారి రెండవ తరగతివారలకు ౨ నెలలకొకసారి ఈ బంధువర్గ దర్శనసౌఖ్యముండగలదు.

## చిత్రమయ జగత్తు

ఆరోగ్యవంతుడైన మానవుని ముఖము మీద మెడమీద ఎన్ని వెంట్రుకలుంటవి?

పనిలేని ఒక పెద్దమనిషి ఒకని ముఖము మెడ గొరిగించి ప్రతి వెంట్రుకను లెక్కపెట్టగా ౨౫౦౦౦ లెక్కకు వచ్చినవట! * *

ఆరోగ్యముగా ఉండే ఆవు సాధారణముగా ఒకనిముషానికి ౬౧ మారులు నెమిరి వేస్తుంది.

* * *

ఇంగ్లీషుజాతి లక్షణాలనుగూర్చి జార్జి బర్నార్డుషా ఒకవిధంలో ఇట్లు చెప్పెను— "ఇంగ్లీషు జాతికి కోపము రానివ్వవద్దండీ అని ఎల్లప్పటికిన్ని ప్రపంచానికి తెలుపుతూవచ్చినాను. ఒకమారు వారికి క్రోధమువచ్చెనా ప్రపంచములో మరెవ్వరును చూపించని ధైర్యము, క్రౌర్యము ప్రదర్శించి తీరుతారు" — అయితేరెండవ క్యాథరీన్ అను విఖ్యాతమైన రష్యారాణి ౧౭౭౨లో ఇట్లనెను "ఇంగ్లీషు వారికి నరాలు పట్టలేదు" * *

ఒక్కొక్క జంతువుయొక్క వయః ప్రమాణ మెంతని పరిశోధకులు పరీక్షించి ఇట్లునిర్ణయించినారు,

| | | |
|---|---|---|
| తాబేలు — | ౨౦౦ | ఏండ్లు |
| ఏనుగు — | ౧౫౦ | ,, |
| గద్ద — | ౧౧౭ | ,, |
| చిలుక — | ౧౦౦ | ,, |
| గరుడపక్షి — | ౧౦౦ | ,, |
| గాడిద — | ౭౬ | ,, |
| గుర్రము — | ౬౨ | ,, |
| తట్టువ — | ౫౦ | , |
| బాతు | ౪౩ | ,, |
| పిల్లి — | ౩౭ | ,, |
| కుక్క — | ౩౪ | ,, |
| ఆవు — | ౩౦ | ,, |

## రంజాన్ దానాలకు యూరపీయులు సిద్ధముగు

దక్షిణఆఫ్రికారాజ్యములో డర్బానులో ఒక భారతీయవాణిజ్య సంస్థ ఉన్నది. ఆ సంస్థవారు బ్రెజిల్ నుండి బియ్యము తెప్పించుటకు అనుమతి కోరిరి. వారు ఎప్పుడును బియ్యము తెప్పించేవారు కారు. కానున్నను వారలకు ఆబియ్యము తెప్పించుటకు అనుమతిలభించెను. ఆ సంస్థవారు తమకు వచ్చిన రవేలపౌనుల విలువగల ఆ ౫౦౦ సంచుల బియ్యమును రంజాన్ నెల మొదటిరోజున దానము క్రింద వినియోగము చేసిరి ౧౫వేల మందికి పైగా వచ్చి తీసికొనిపోయిరి వారలలో భారతీయస్త్రీలు బుట్టలతోను, యూరపీయులు సంచులతోను, వచ్చిరి. ఇంకను పిల్లలుకూడావచ్చి ఆ దానమును గ్రహించిరి.

